# అక్షర ప్రదానము

ప్రతిగృహీత : కవులు, ప్రసన్నగేయ కవితానిధులు, కవితాప్రియులు,
కళాపోషకులు, ఆదర్శగ్రామ నిర్మాతగా పేరెన్నికగన్న
దేశభక్తులు

## శ్రీ తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తిగారు



అందుకోనుము కృతి రాణీ
సుందరవగ వ్యాదుపా:క-

సిరిసరస్వతుల యొడినిగోముగా
మెరుగుదేరిన జగాలావణ్యము
పాలబడియె బందీగా నాకృతి
వాలుకనుల చెరసాల మోసాల !

అందుకొనుము ...

రాచకీయాల గక్కుసపాదలో
రాసిక్యమురల్చు తేనెపెరవో
నాడునాడు గాలించి, నీ వలపు
నీడలోన నేరూని నిలతిక.

అందుకొనుము ...

కవనకళాసువిలాసిను లెందరో
కలుగు నీ జనానాలో మున్నె;
పరువుకొరకు నిను వరించినదోయి
పట్టమహిషిగా నేలుకొందువని.

కృతిప్రదాత :
కొనకళ్ల వెంకటరత్నం.

# పరితోషణ

**బి. వి. నరసింహారావు**

కవి మిత్రులు శ్రీ కొనకళ్ళ వెంకటరత్నంగారు తన బంగారిమామ పాటలకు నన్ను ఏమైనా రెండు పరిచయ వాక్కులు వ్రాయవలసిందని కోరినప్పుడు నాకెందుకో ఆశ్చర్యం, ఆనందం కలిగినయి.

"అదేమిటి ? మీపాటలకు సిసలైన వెల నిర్ణయించగల షరాబులు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు. ఈనాడుంటే శ్రీ నండూరి సుబ్బారావు గారు మీ పాటల అంతస్తుని తన అమూల్యాభిప్రాయంతో కొలిచి ఉండే వారు. ఆలా వాగ్దానంచేశారుకూడ ఆయన. అసలు శ్రీ చలంగారొక్కరే ఏదైనా వ్రాస్తే అంతశ్శుద్ధిగల ఆ మనీషివాక్కులు మీ కృతిద్వారానికి తోరణంగా అందగించేవి" అన్నాను నేను.

"ఔను. అదంతానిజమే. కాని వారందరి అభిప్రాయాలు సాధి కారంగా సమన్వయంచేసి అందమైన హారంగా గ్రుచ్చి అందీయగలవారు మీరు. అంతేకాదు ఎన్నో సంవత్సరాలు నాపాటలు నాట్యంలోపాడి అభినయించి ప్రచారం చేసిపెట్టినవారు. అందుచేత మీరే వ్రాయాలి. మీరు వ్రాస్తే నాకెంతో ఆనందం, తృప్తి" అన్నారు మిత్రులు.

ఆ మాటలు వినగానే ఆశ్చర్యానందాలను మించిన ఏదో భావం నాలో పరుగులుతీసినట్లయింది; పరవళ్ళు త్రొక్కినట్లయింది.

ఈపాటలపై పెద్దల అభిప్రాయాల్ని కొద్దిగానైనా ఇక్కడ ఉల్లే ఖిస్తే నాధర్మాన్ని నిర్వహించిన వాణ్ణవడమే కాకుండా, ఈ పాటల విలు వను కొంతకుకొంత స్పృశించినవాణ్ణికూడా ఔతాను.

మొదట శ్రీ చలంగారి మాటలు ఉదహరిస్తా —

"కొవకళ్ళ వెంకట్రత్నంగారి పేరు అసలు ఒక వ్యక్తిగానన్నా ఎవరూ వినలేదేమోననిపిస్తుంది. ఏలూరులో ఒక ఉదయం చేరాము - నండూరి సుబ్బారావుగారి ఇంట్లో - నేనూ, కృష్ణశాస్త్రి, నారాయణ బాబూ. ఆయనని పాడమని అడుగుతున్నారు శాస్త్రిగారు. శాస్త్రిగారు ఇట్లా మనుషులచేత పాడించడం, వాళ్ళు పాడడం - నాకు పూర్వకాలం చాలా అనుభవం. కనక ఆయన అడగడంలో విలువమైన నాకు సందేహం. వెంకట్రత్నంగారినించి ఏదో ఒక పదజాలం ఏదో రూపంలో మా మధ్యకి ఉరికి మడుగుకట్టి, నన్ను తొరగా ఇంటికి పంపుతుందనే ఆశతో తల తిప్పుకున్నాను. నా చెవికి "సుక్కలన్ని కొండమీద సోకుజేసుకు నేవేళ" అన్నమాటలు, కృష్ణశాస్త్రిగారినుండి ఊపిరిబిగపట్టిన అరుపూ వినిపించాయి. కళ్లువిప్పి ఏమిటది? అన్నట్టు చూశాననుకున్నాను. మరి ఎట్లా చూశానో!

తలవొంచుకుని మాతో సంబంధంలేకుండా పాడే వెంకట్రత్నం గారితో ఐక్యమయింది నా మనసు. ఎంకి పాటల్ని అనుకరించిన పాటల్ని చూస్తే నాకు అసహ్యం. కొని ఇవి ఎంకిపాటల అనుకరణంకావు. ఎంకి పాటలనేవి లేకపోయినా ఇవి తెలుగు ప్రపంచంలోకి రావటం ఆగేది కాదు. కొన్నికొన్ని పాదాల్లో ఎంకిపాటల్ని మించిన లయ-విరుపులు - శబ్దంలో సంగీతం, ఎక్కడనించో అపురూపపు పుష్పాల్ని ఏరితెచ్చినట్టు ఆ మాటలు, మాటతోమాట ఐక్యం-అంతా ఒకగొప్ప అపురూపమైన, చాలా అందమైన కవిత్వపు పటం.

పంటబోది వరిమడితో
పకపక నవ్వేవేళా—
చీకటి మిణుగురు జోతుల
చిటిలి చిల్లులడకమునే—

అంటూవుంటే హడలిపోయి చూశాను. ఈ పాటలు ఇంతకాలం వినక బతికిన నా అలసత్వానికి సిగ్గుపడుతో. ఆ పాదాలలోని సంగీతాన్నీ, కవిత్వాన్నీ వినలేకపోయినా, వినికూడా 'ఎంతగొప్ప' అని తలవొంచలేక పోయినా- ఎంత దౌర్భాగ్యం!

మళ్ళీ మళ్ళీ ఆదరంతో బి. వి. నరసింహారావుగారు వెంకట్రత్నం గారి కవిత్వంలోని అందాన్ని, పాటలో శ్రావ్యంతో నింపి. నా మనసుని రేడియోలమోతలో. బస్సు దుమ్ములో కుంగిపోకండా దులిపిపోతో వుంటారు. నరసింహారావుగారి కంఠంలో నాజూకుగా పలుకుతో, పాట లోని ఎన్ని నిగూఢ భావాలు వ్యక్తమౌతాయో!

"చూపులో సిరి చిందువాడా!" అనగల కవిని ఎట్లా ఉపేక్షించి ఊరుకోవడం? నరసింహారావుగారి కంఠంలో, డాక్టరుగారి ముఖంలో- చిందుతుంది సిరి. కాని, స్త్రీ ప్రేమించి సంబోధించగల సిరిని చూపుల్లో చిందగల యువకులు ఈనాడు లేరు.

కాని, సృష్టిదేవత కరుణించి ప్రసాదించిన ముఖంలో సిరినైనా కాపాడుకోవాలంటే, ఎంత జాగ్రత్త, ఎన్ని అబద్ధాలు, చల్లగా తప్పు కోవడాలు అవసరం. కంఠంలో సిరినైనా ప్రకాశింప చెయ్యాలంటే చాలా వంచనలూ, యాచనలూ కావాలి. ఆ సిరిని రూపాయలుగా మార్చు కోవలసి వొచ్చినపుడు-మెట్టుదిగి వొకరించనివాడి కలంలో సిరికూడా కాసుకి పనికిరాదు".

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారికి బంగారిమామ పాటలంటే చాల మంచి అభిప్రాయం. వాటి రచనాశిల్పాన్ని, భాషాసౌష్ఠవాన్ని, భావ సౌకుమార్యాన్ని ఆయన మెచ్చుకుంటారు. ముచ్చటపడి మరమరి పాడించు కుని వింటారు.

యెంకిపాటల కర్త శ్రీ నండూరి సుబ్బారావుగారు. ఈ పాటలు మొదట విన్నప్పుడు మైమరచి పోవడం నేను కన్నారా చూశాను.

"ఇలాంటి ఉత్తమ గేయాలు రచించిన యువకవిని ఉచితరీతిని సన్మానించడం నా కనీస ధర్మం" అన్నారు. అలాగే ఒక గొప్ప సభను ఏర్పాటు చేసి, శ్రీ శివశంకరశాస్త్రి, శ్రీ కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగార్ల వంటి సాహితీ వేత్తల సమక్షాన ప్రియమారా గౌరవించి సత్కరించారు. ఆ ఘట్టం శ్రీ వెంకటరత్నంగారి సాహిత్యపు విలువకు ఒక చక్కని గీటురాయి.

ఆంధ్రదేశంలో కవులు, గాయకులు, రసజ్ఞులు అందరికీ ఈ బంగారి మామ పాటలమీద ప్రత్యేక గౌరవభావ ముండడం నేనెరుగుదును. అనేక రంగాల్లో ఈ పాటలు పాడడం నేనెరుగుదును. ఈ గేయాలు రికార్డయి, అనువాదంపొంది ఖండాంతరాలుకూడ ప్రయాణం చేయడం జరిగింది. ఈ పాటలు కొన్ని చలన చిత్రాలలోకి వెళ్ళాయి. అయితే చిత్రం! ఈగేయాలకున్న ప్రాచుర్యం రచయిత అయిన శ్రీ వెంకటరత్నంగారికి లేకపోవడం గమనించాలి. చలంగారన్నట్లు ఈ రచయితపేరు ఒక వ్యక్తిగానన్నా చాలమంది విని ఉండరు.

మొదటిసారి ఈ పాటలు నేను విన్నప్పుడు నా హృదయం రసప్లావితమైపోయింది. నా శరీరం నాట్య పారవశ్యం చెందింది. ఈ పాటలు పాడి పాడీ నృత్యమాడి యాడీ నేను ప్రతిగుండెతోనూ కదిలాను అనేక సంవత్సరాలు. నాకు జానపద సాహిత్యంమీద చక్కని అభిమానాన్ని, అభిప్రాయాన్ని కలిగించడానికి, నా నాట్యానికి ఒక విశిష్టమైన ప్రశస్తిని ప్రత్యేకతను సమకూర్చి పెట్టడానికి ఈ పాటలు దోహదం చేశాయి. నేను నాట్యంలో అన్వయించుకుని అభినయించినవి– 'రావోయి బంగారిమామా' 'మొక్కజొన్నతోట', 'నారాతకిలా', 'వలచీనాడమ్మో', ముసురేసిందంటే', 'రాకోయి నారాజా' మొదలైన గేయాలు. 'రోడ్డు రోలర్', 'ఏడకెల్లినగాని' వంటి అనేక గీతాలు సభావేదికలమీద పాడి శ్రోతలను రాగరసరంజితులను చేయగలిగాను.

ఇందులోని ఒక్కొక్క గేయం ఒక్కొక్క రసగుళిక. ఒక్కొక్క అంద మైన కథానిక. అద్భుతమైన చిత్రణ.

ఎలావచ్చాయో వచ్చాయి శ్రీ వెంకట రత్నంగారి హృదయాన్ని చీల్చుకుని ఈ పాటలు మరోలోకపు మంచి మల్లెల్లా, పారిజాతాల్లా పరిమళాలు దశదిశలా వెదజల్లుకుంటూ.

ఈపాటల సృష్టికి శ్రీ వెంకటరత్నంగారి జీవితంలో ఒక మామూలు శృంగార ఘట్టంగాని, మరి యే ఇతరంగాని కారణం కానేకాదు. రస స్నిగ్ధమైన అతని హృదయం జానపద సాహిత్యాన్ని, జానపద జీవిత రహస్యాన్ని అంత ఆకళింపు చేసుకుని రాశీభూతం కావడ మొక్కటే అందుకు కారణం. అందుకే ఈ గీతాలు అంత పదనుగా, భావపరిమళ భరితంగా ఉండడానికికూడ కారణం.

'పాడుకోగలిగితేనే బ్రతికుంటాయి' అన్న ప్రవాదం ఈ పాటలకు వర్తించదు. పాటకు. ఆటకు బహురమ్యంగా మలగిన ఈ గేయాలు మానంగా లోలోపల చదువుకున్నా, అర్థాలు, అందాలు అనేకం రంగుల రాగాలుగా, పదచిత్రాలుగా భావవైచిత్రితో మనకు జిగ్గుజిగ్గున సాక్షాత్కరిస్తూనే ఉంటాయి.

మురిపించి మైమరపించే ఈ గేయాలు ఒకవంక నులివెచ్చని జానపద శృంగారాన్ని చిందిస్తూ, వేరొకవంక సామాజిక జీవన చైతన్యాన్ని సమ పాళంలో రంగరించుకుంటూ పోతాయి.

ఈ గేయాల ఛందస్సు చాల విలక్షణమైంది. గేయాలు వివిధ గతుల్లో, వింతవింత లయలో ఠీవిగా సాగిపోతాయి.

చుక్కల రథంమీద చక్కగా పయనించే చందమామ మనకున్నంత వఱకు ఈ పాటలు తెలుగు సాహితీ గగనవీధుల్లో సహృదయ హృత్సర స్సీమల్లో కలహంసయానం చేస్తూనే ఉంటాయి.

*

# అంజలి బంధం

నా సాహితీసంసారయాత్రలో తొలిపుట్టువు 'ప్రతిక ' కృతికన్యను పరిగ్రహించిన రసికాగ్రణి, సాహితీ ప్రియుంభావుకుడు శ్రీ పసల సూర్య చంద్రరావు. రెండవదుహిత 'ప్రొద్దుతిరుగుడుపూల'ను స్వీకరించిన సుమనస్వి 'సహజకవి', 'కవిపాదుషా' శ్రీ కొప్పరాపూరి సత్యనారాయణగారు. ఆ యిరు వురి ఆశీర్బలంతో అంతస్తులు పెంచుకొన్న నాయీ 'బంగారిమామ పాటల' కృతిని, గేయకవితా పారంగతులు, వదాన్యులు, దేశసేవానురక్తులు శ్రీ తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తిగారికి అందిస్తున్నాను.

ఈ నా పాటల పూదీవ కుదుళ్ళు శ్రీ చలం, శ్రీ నండూరి కవుల ప్రోత్సాహవచనామృత సేచనలో తడిసినవి.

కవిమిత్రులు శ్రీ బొడ్డు బాపిరాజుగారి చల్లని చూపులలో కొనలు సాగినవి.

నా కలానికి బలం సహృదయులు శ్రీ పైండా వెంకటరత్నంగారు, శ్రీ కమ్ముల మాణిక్యాలరావుగారి ఆదరాభిమానాలు.

నేను కూర్చిన కవనసౌరభాన్ని తెరలుతెరలుగా గుప్పున నలుదెస లకు పంచియిచ్చిన మలయ సమీరులు, తనరసనాగ్రంమీద, తనకాలి అందెలలో నాగీతాలకు రెక్కలు తొడిగి, చుక్కలలో విమానయానం చేయించిన గంధర్వకుమారులు శ్రీ బి. వి. నరసింహారావుగారు. ఇదివరకే క్రిక్కిరిసిపోయివున్న ఆసుహృన్మూర్తి కంఠసీమలో ఒక చిన్న అక్షర సుమహారం.

రావంటే రావేనోయి !
రావుజీకి సాటెవరోయి ! !

చల్లగాలి గలగల విన్నా,
మల్లెపూలు జలజలమన్నా,
రావుజీ హుటాహుటి వచ్చిన
భావమే స్ఫురించు తళుక్కున

రావంటే...

పాటలలో ఆటకు హొయలూ,
ఆటలలో పాటకు లయలూ
సంతరించుకొన్న యశస్వి !
వింతగొల్పు కళాతపస్వి ! !

రావంటే...

అవును తేటతేనెసరస్సు
అతగాని ప్రసన్నమనస్సు ;
పలుకు పసందులవే చాలు
పాలరాతిపావంచాలు !

రావంటే...

కిలకిలమను పసిపాపలకూ
తలనెరసిన తాతయ్యలకూ
పూల వంతెనలు విరచించే
బాల సాహితీ పుంభారతి ;

రావంటే...

కొనకళ్ల వెంకటరత్నం.

# తొలివలపు

వలచీనాడమ్మా
మనసు
కలచీనాడమ్మా

దారంట మగలీవి
తారసిల్లును దినము !
కాలిధూళిగ మారి
రాలి పోయిన చాలు !
వలచీ...

గుండెలోతులు దొలిచే
గోరు వెచ్చని వాని
వాలుకన్నులలోన
కాలిపోయిన చాలు !
వలచీ...

మాటలోపల నేదో
మంత్రమున్నదె ! వాని
కవుగిట్లో కడసారి
కన్నుమూసిన చాలు !
వలచీ...

పాటపాడితె చాలు
తోట పులకించేను !
వింటూనె ప్రాణాలు
విడిచీన చాలమ్మ !!
వలచీ. ...



## 'రావోయి బంగారి మావా'

రావోయి బంగారిమామా

నీతోటి

రావాస్య మొకటున్నదోయీ

పంటకాలువ ప్రక్క—
జంటగా నిలుచుంటె,
నీడల్లో మన యీడు
జోడు తెలిసొస్తాది -

రావోయి ...

ఈ వెన్నెలల సొలపు,
ఈ తెమ్మెరల వలపు
రాత్రి మనసుఖకేళి
రంగరించాలోయి -

రావోయి ...

నీళ్లతూరల వెనక—
నిలుచున్నపాటనే
జలజలల్ విని, గుండె
ఝల్లుమంటున్నాది -

రావోయి...

ఈనాటి మనవూసూ
లేనాటికీ, మనకు,
ఎంత దూరానున్నా,
వంతెనల్ కట్టాలి –

రావోయి ...

అవిసెపువ్వులు రెండు
అందకున్నాయి నాకు;
తుంచి నాసిగలోన
తురిమి పోదువుగాని –

రావోయి ...

ఏటిపడవసరంగు
పాట గిరికీలలో
చెలికాడ మనసాదల్
కలబోసుకొందాము –

రావోయి ...

జొన్నచేలో, గుబురు
జొంపాలలోగూడ,
సిగ్గేటో మనసులో
చెదరగొడుతున్నాది –

రావోయి ...

*

## 'ఏ గంటకు?'

ఏగంటకు రమ్మంటవె కన్నెలేడి ?

మ

వ్వేడ కాచుకోనుంటవె వన్నెలాడి ?

పూగతోటకు నీళ్లుపెట్టి,
బుగతగారి నేమరించి,
కోరుకొన్న మొగలిపొత్తి
కొండకోన వెతికితెచ్చి,
అలసట తీరేతలికే
అద్దరేత్తి రవుతాది –

ఏగంటకూ ...

చీకట్లో నీఅందము
చిక్కవిడదు నాకంటికి;
వెన్నెలలో నీరూపము
కన్ను చెదరగొడతాదీ;
చీకటి వెలుగుల సందున
చేరరావె చిన్నారీ –

ఏగంటకు ...

మోటుసరుకుతోటగాలి
కాశేస్తే కసిరి కసిరి,
ఏమ్మతోట పరువానికి
విలువలేక నిలువలేక,
నలుగుడుపడివస్తే ను
వ్యాలిగిరాకు ఆగిపోకు –

ఏగంటకు...

చిలిపితనానికి పేరు
చెల్లెమ్మకు దొరికేవు;
గుంటలకో నేటిమీద
గొబ్బెమ్మలు నిలిపింది;
అడుగుపడిందంటె చాలు
ఆనవాలు పట్టేస్తది –

ఏగంటకు...

సోగకనుల్ పట్టలేను
తీగమల్లెకడ వొద్దు;
కలిసిపోవు నీబుగ్గలు
గులాబంట్ల వెనకొద్దు;
పువ్వులపొంత పొదలచెంత
పొంచుని నన్ను వంచింపకు –

ఏగంటకు...

పొడుపుకతల తమ్మయ్యకు
పొద్దోయిందని పాడి,
ఊసులాడు నేస్తాలకు
'ఊ' కొట్లతో సరిపెట్టి,
కునికే చుక్కల వెలుగున
గుట్టుచప్పుడుగ రా సుమి
ఏగంటుకు...



## ' మొక్కజొన్న తోటలో '

సుక్కలన్ని కొండమీద
సోకు జేసుకునే వేళ,
పంటబోది వరిమడితో
పకపక నవ్వే వేళ,
సల్లగాలి తోటకంత
సక్కలగిలి పెట్టు వేళ,
    మొక్కజొన్నతోటలో
    ముసిరిన చీకట్లలో,
    మంచెకాడ కలుసుకో;
    మరవకు మామయ్యా.

చీకటి మిణుగురు జోతుల
చిటిలి చిల్లులడక మునే,
సుద్దులరాగాలు చెవుల
నిద్దరతీయక మునుపే,
ఆకాశపుటాడిని తోట
ఆవలింతగొనక మునే,

పొద్దువాలబడగానే
క్రాంతిదారి వెంటనే,
సద్దుమణగనిచ్చిరా,
ముద్దులమామయ్యా !

గొడ్డుగోద మళ్లేసే
కుర్రకుంకలకు గాసీ,
కలుపుతీతలయి మళ్లే
కన్నెపడుచులకుగాసీ,
బుగ్గమీస మొడివేసే
భూకామందుకు గాసీ,
తోవకెదురు వస్తివా,
దొంగచూపు చూస్తివా,
తంటా మన యిద్దరికీ
తప్పదు మామయ్యా !!

కంచెమీద గుమ్మడిపువ్వు
పొంచిపొంచి చూస్తాది;
విరబారిన జొన్నపొట్ట
వెకిలినవ్వు నవ్వుతాది;
తమలపుతీగెలు కాళ్లకు
తగిలి మొరాయిస్తాయి;

చెదిరిపోకు మామయ్యా,
బెదిరిపోకు మామయ్యా;
సమురుకో నీపదానుగుండె
సక్కనిమామయ్యా !

పనలుకట్టి యెత్తి నన్ను
పలకరించబోయినప్పుడు,
చెరుకుతోట మలుపుకాడ
చిటికవేసి నవ్వినప్పుడు,
మోటబావి వెనక నాతో
మోటసరస మాడినప్పుడు
కసిరితిట్టినానని,
విసిరికొట్టినానని,
చిన్నబోకు నలుగురిలో
సిగ్గది మామయ్యా.



# విందుకు పిలుపు

మాపటివేళా విందుకు రావోయ్,
మతకరిమామయ్యా !
జాతరలోపల పిల్లామేకా
సరదాలో సతమతమై వుంటవు
మాపటి....

అందముగా, తీ పందుకు నేలా,
అరిసెలు నోటికి అందిస్తానో,
వారిస్తూ, చవులూరిస్తూ, "నా
బుగ్గలె రుచి" అని బులిపిస్తానో,
అందీ పొందని
అశలు పోకోయ్
మాపటి...

కోరికతో, కొనగోటి వినుపుతో
మీగడ పెదిమల మీటిస్తానో,
కనుగొనలో తడిమనసులు జార్చె
కాటుక చూపుల కవ్విస్తానో,
వివరణగా మా
టివగల నటరా ?
మాపటి....

అలమటవో. ఆయాస మిగిరిపో,
కొంగున విసరి కంగిస్తానో,
ఊహలలో వ్యామోహాలు చెరగే
ఊపులతోనే ఉడికిస్తానో,
ముందే ఆరా
లెంపకు పోరా

మాపటిరి . . .

పలపదాల ఉయ్యాలలలోన కి
లాలింపుల నిను లాలిస్తానో,
ముసిముసిగా నిను గుసిలింతలు, పాడి
మాటలతోనే మురిపిస్తానో,
నా నోటంటె వి
నాలంటే సరి !

మాపటిరి . . .

రాశ్నము తోఇకు పరాసికములలో
తమలపు చిలకలు నమిలిస్తానో,
పెదిమల కొసలో కదిలే కలలకు
పొంగే పలుపుల రంగేస్తానో,
ఈలలు తియకోయ్
కీలక మిపనోయ్

మాపటిరి . . .

పందిరికోస, పూ బంతి వరసలో,
పరుపులు జంటగ పరిపిస్తానో,
పదిలముగా, నీ హృదయములో అడి
యాసలు పరిచీ అలయిస్తానో,
మగువేతానై
మనసిస్తాదా ?

మాకటి...



## "గోదారి గట్టుంట"

గోదారిగట్టుంట
పోదారి మామా;
సిగ్గులో వలపేటో
భగ్గుమన్నాది.

పట్నవాసపుగాలి
పడదస్నలే మనకు ;
మసక వెన్నెల లింకు
ఇసకతిన్నెలకేసి

గోదారి ...

తొలివాన జల్లుకో,
వలపుకవ్వుగిల్లకో
పులకరింతలు ఒడల్
పాక్లిపోయిసవోయి

గోదారి ...

మనసులో కోరకల్లె
మసలె చిన్నారిదోనె;
తోటకోరడి మలుపు
దాటిపోనీ క్షణము-

గోదారి ...

దారిలో చందురుడు
ఓరచూపులు మాని,
కారుమబ్బుల వెనక
కనుమూసినాడు లే-

గోదారి ...

వానలో మెరుగుపూల్
సోనలై దిగజార,
చెదరి, కొబ్బరితోట
చేసైగ రమ్మంది-

గోదారి ...

చిలిపిమనపాదాల
చెదరిపో కెరటాలు,
మన జంటచూపుల్ల
మరులు గిలకొట్టాలి-

గోదారి ...

*

## 'ఏరు దాటిస్తా'

ఏరు దాటిస్తానె చిన్నదానా నా
కేమిస్తువె సాహసమున్నదానా ?

కోయని ఒక పిలుపేనా,
తీయని ఒక పలుకేనా
చాలునులే నేటి కంత
చనుమానము లిస్తివంటె —
ఏరుదా...

ఒరిగెనులే సంజె ప్రొద్దు;
వరదహోరు భయమువద్దు;
చూపుమేర దూరములో
ఆపద రెవ రిద్దరమే —
ఏరుదా...

బల్లకట్టు మూసిపెట్టి
పడకేసిందులె సరంగు;
అప్పనను మొకసిటికలోన
అద్దరి జేరుస్తానిక —
ఏరుదాటి...

తుళ్లింతలయేటినీటి
తుంపర్లైన సోకనివను;
సెదరనీను కవుగిట నీ
సిగపూ గమగమలైనా

ఏరుదాటి...

కోరడి మలుపున లేడూ
కూచున్నా తోటమాలి
ఎళ్లేసిన మైలురాయి !
ఎందుకె నీకంత బెదురు ?

ఏరుదాటి...

చిరునవ్వులు చెదరకుండ
సిగ్గుపూరలు చీలకుండ
తేలికముద్దొకటీవే
వాలుకనుల వగలాడీ !

ఏరుదా...

మాటిస్తా నీ సారికి
మారాములు సేయనులే;
ఒంటరి నీమనసుగుట్టు
ఊరక మోగిస్తునంతె

ఏరుదా...

*

# ఎందుకో ఈ రేయి

కోడలుపిల్ల :

ఎందుకో ఈ రేయి ఇంత చల్లనిహాయి ?
పయన మెందాకాను బంగారి మామా
వయనాలు తెలుపోయి వయ్యారి మామా

బంగారిమామ :

పైరగాలికి తూగి పంట లచ్చిమిదేవి
పవ్వళించేవేళ పల్లదనమేలె ?
నగవాకె వగలాడి నా చిన్నిరాణీ !

కోడలుపిల్ల :

మంచోడవని నమ్మి మామ నీతోవస్తె,
మనిషి మసలని యేటి మళుపులో నటరా
మాటమంతీలేని మౌనాలు రాజా !

బంగారిమామ :

ఒంటిగా నీవెంట ఒక్కగడియే చాలు,
అడుగులో అడుగేవె అందాల దీవి !
మాట లెందుకులేవె మనుసున్నచోట

కోడలుపిల్ల :

మిసమిసల్ చిమ్మేటి మిరపతోటల నీటు
కాటుకల చీకటుల కరగిపోయ్యేను !
నిలుమోయి భయము పామె నీపు నెన్న నోయి

బంగారిమామ :

కతచెప్పమని నన్ను కవ్వించి కవ్వించి,
కతకు మూలము జంట కలవకుండానే
కదిలిపోదామంటే కటికిమనసేమే ?

కోడలుపిల్ల :

ఏరు తగిలిందంటె ఎనకదారికి సున్న;
తోట జీబురుమంటు తొంగిచూచేను !
వవుదవ్వు పోతావు దరికేని రావు !

బంగారిమామ :

సరుకు తోటల వెనక చందమామ ముసుగోను,
కోరడవతల ఒక్క కోరికున్నాది –
చిన్ని ముద్దొకటివె చిటిమల్లెపూవ!

# ముస్తాబులు

కోడలుపిల్ల :

ఈ చీరకు పయుటింపో,
ఆ రైకను గడిసొంపో,
అందాలను తూచేటి ప
సందు చూపు కలవోడా !
ఇవరము తెలిపిపోర
ఇనుకుంటానోయి,
సెబా
సనుకుంటా రాజా.

బంగారిమామ :

పువ్వువంటి పడుసువు నువు
నవ్వుతు సింగారిస్తే,
ఏ చీరకు ఎంతందము
ఎదురొచ్చేనో తెలవక,
సిక్కొచ్చిపడ్డదోలె
చిన్నరామచిలకా !
నా
చిటిగులాబిమొలకా. !

కోడలుపిల్ల :

ఉలకవు పలకవు చాలును,
'ఊఁ' కొడతా వంతేనూ;
ఆకలిచూపులతో క
న్నప్పగించి చూస్తావూ;
పరాకు లెందాకా ?
బంగరిమామయ్యా !
నువ్వు
దొంగవు లేవయ్యా !!

బంగారిమామ :

ఏమని బులిపించేవో
ఇనిపించదు రవ్వంతా;
కదిలే నీ పెదిమలతో
కలలు వ్రేల్చి నా కళ్లకు
పనిగలిపిస్తువుగదె
పైడిలేడికూనా !
నా
బంగరువిరికోనా. !

కోడలుపిల్ల :

ఈ రవ్వల ఆముత్యాల
నెది నాజూకైననగో
చెప్పరాదా చనువునకయి
సేయరాదా మనసారా ?
నీవయి మెచ్చని కళ్ళ
నేరమొకిద, నీయెడ
అప
చారమొక్కద రాజా !

బంగారిమామ :

అందాలకు మారుపేరు
అమ్మాయొకతున్నదేరా !
నగవుంచితె ఒడలిమెరుగు
నగము తరిగిపోవునటా !!
చిల్లరముస్తాబులు
చెల్లునె సుకుమారీ ?
నా
మల్లెలరహదారీ. !

*

## ఖులిపింపులు

జంగారిమామ :

పూలివిగో,
రంగుల
పూలివిగో,
గమగమ
పూలివిగో నే-
పూలల్లో నీ అందము
పొంచున్నదిలే !
అందము
పొంచున్నదిలే !

కోడలుపిల్ల :

పూలంటేనే
చిరాకు !
పూలొద్దోయీ
మామ !
పూలొద్దోయీ,
ఆ
పువ్వులు నీ జడకెంతో
పొలుపంటవులే
ఎంతో
పొలుపంటవులే-

బంగారిమామ :

పల్లెవిగో నే

ముగ్గిన

పల్లెవిగో,

తీయని

పల్లెవిగో నే !

పళ్లుతింటె కలలన్ని

పంటకొస్తవి

కలలే

పంట కొస్తవి !

కోడలుపిల్ల :

పళ్లంటే నే

వెగటు,

పల్లెట కొల్లలు,

మామ

పల్లోద్దోయీ !

పండుతింట పలుకొక్కటి

పలకమంటవు !

ఒక్కటి

పలకమంటవు !

బంగారిమామ :

కతసెబుతా నే
పిల్లా,
కతసెబుతా
రావే,
కతసెబుతా నే !
ఆ
కతలో మనుషులనిట్టే
కళ్లకు గడతా !
చక్కాఁ
కళ్లకుగడతా !

కోడలుపిల్ల :

కతలంటే మా
విసుగూ,
కతలొద్దోయీ
మామ,
కత వినవోయీ ;
కతలోపల జంట నొకటి
కలిపిస్తవులే !
జంటను
కలిపిస్తవులే !

బంగారిమామ :

పదం పాడ మం
టావా ?
పద మినుకుంటావా ?
హో
పదమింటావా ?
కూకుని
పదం పాడితా, గుండెలు
పగిలెను పిల్లా !
గుండెలు
పదిలము పిల్లా !

కోడలుపిల్ల :

పదమంటేనే
గత్తర,
పాటంటేనే
మంటా !
పద ముద్దోయీ,
నీ
పదమినగానే నెత్తురు
పదు నోస్తదిలే !
చురచుర
పదు నోస్తదిలే !

## రాకోయి రాజా

రాకోయీ నా రాజా,
అపుడే
రాకోయీ నా రాజా !
నీ
రాణిగారు కబురంపేదాకా
రాకోయీ నా...

వస్తావని పదినాళ్ళోయి విన్నా,
ముస్తాబింకా ముగియనె లేదు ;
మోహపడిన నా రాజు కనులలో
మోజు చెడిన, బ్రతుకేల కాల్పనా !
రాకోయీ నా...

పండువంటి నావొడలికి దీటని
పండుగనాడీ వంపిన చీర,
ఎట విడిచితినో, ఎటూ మరచితినో,
ఏమి తేల, దెటుపాలుపో
దపుడే
రాకోయీ నా...

రానన్నావల్లా రాత్రీపగలూ
రాలేదని గుండెలలో దిగులు !
వస్తావని విన్నపుడే మొదలూ
వచ్చి గడియ నిలవోయని గుబులూ
రాకోయీ నా...

మల్లెలు మనుసో, ముంకెన సొగసో,
మది నీ కెది ఇంపగునో తగునో,
అడివి, కోన గాలించి వెతికినా
అందమైన పూ వమరదు సిగలో !
రాకోయీ నా....

సిగ్గు తెరలలో చిరునవ్వుపొరలో
చిటిపొటిమాటలు చిలికేతీరు
పలుకుటలో, మరి పలకరింపులో,
పట్టుపడలేదు పరాకె వదలదు
రాకోయీ నా....



# కోయిలజంట

కోడలుపిల్ల :

కో...　　కో..
కోయిలనై, సకోరనై, మామిడి
కొమ్మల్లో దాగివున్నానోయి
కో... కో...

బంగారిమామ :

కో...　కోహో...
కో అంటే ఒక కోటిపరాకే !
గున్నమావికొసకోయిలరాణీ !

కోడలుపిల్ల :

అలసి సొలసి డస్సిపోయినావని
పొలముగట్ల పరవళ్లయి వస్తిని !
చిలకలుకొరకని సీమరేగు పం
డ్లొలిచి తెస్తి నోడినిండా సెకై
కో...　కో...

బంగారిమామ :

మైమరుపులు కలిపిస్తువుగద నీ
మాటల తేనియ తేటలతోనే !
పాటలలో మోదిపేవా ఇకనే
పాటి ఫల మమృతఘుటికకాదుమరి !!
కో... కోహో...

కోడలుపిల్ల :

నీకే, నీకొరకే, నీవరకే,
నెరివిచ్చిన గుండెలదీపాట !
వినసీయకు సరుకుతోట కావల
వెదురుబిడెము వింటున్నది రాజ్యము
కో... కో...

బంగారిమామ :

మట్టిలోన మానసుకొన్నానే
మనిషిపుటక మొనమొన్నటిదాకా ;
అడుగడుగున నీపిలుపు వినంగనె
అందకాడనని అతిశయమేలో !
కో... కోహో...

కోడలుపిల్ల :

చిగురాకుల వెనకాల పదిలముగ
చిన్ని పెదిమలను దాచితి నీకై,
పూలదుమారము తేలి తేలి తెర
వాలిచె నిట, నను బోల్చుకోదారా
కో... కో...

బంగారిమామ :

కోయిలకోదమలు మూగవోయె నీ
కొమ్మ తేనె లల్లార్చినపాటకు !
పూలతోట లెగబోసి వాసనలు
పులుకుపులుకుమని కలయజూచెను !
కో... కోహో...

కోడలుపిల్ల :

పదిమల్లెలకన్నా తూగుదునా ?
అదటునడిగి నీమోడి వ్రాలుదునా ?
చీకటిప్రొద్దున చిక్కితినిక ఇలు
చేర్చవోయి ననుకోరుకొన్నదొర !
కో... కో...

బంగారిమామ :

రాలినచుక్కై—, దేవలోకపు వ
రాలముద్దవై వ్రాలుము రాణీ,
కౌగిలిలో ఇమడని నీరూపము
కటికిచేతుల్ల కసిగందేనో

కో...     కోహో...



# ఎందుకో మరి?

ఈయేళ మామయ్య
మాయింటి కొచ్చాడు
ఎందుకో మారి ఎందుకో?
ఈ
సందేళ పులమారి నందుకో

మానాలనేగాని
మత్తుజల్లనివాడు,
కలలోపలేగాని
కనపడని మారాజు,
ఈయేళ...

కన్నకల నిజమల్లె
కలిచేశె నిన్నాళ్ళు ;
ఈ నిజము కలకన్న
ఇచ్చిత్రమైపాయె
ఈయేళ...

తేటమజ్జిగరవ్వ
తెప్పించుదామంటె,
ఇరుగమ్మ పొరుగమ్మ
ఎట మునిగిపొయ్యారో
ఈయేళ ...

ఎవ్వారు లేరనో,
ఎవరొ స్తరనో, మనసు
కిందుమీదవుతాది,
బండాల పడతాది
ఈయేళ ...

చిగురాకు వెనకాల
చిలిపినవ్వులమల్లె
దాంగొచ్చి నాడంట
తొంగి చూస్తాడేంగా !
ఈయేళ ...

చూపుక్రిందుగ వాలి,
చుక్కల్లు గుమిగూడి,
గుట్టు తెలిసిందేమొ
గుసగుసలు పొయ్యేను
ఈయేళ ...

కటికి గుండెల తేనె
చిటిలి రాలే వేళ,
మాయదారి సిగ్గు
మటుమాయ మవు వేళ,
ఈ యేళ ...

కన్నుగీటు చుక్క
కండకావర మెంత !
ఏ రాజో తన రాజో
ఎరుగదో కాసింత !!
ఈ యేళ ...

అలిసిపోయొచ్చావో,
అలయింప వొచ్చావో
అంది అందని మనసు
అంపకోత గదయ్యో !
ఈ యేళ ...



# కొండదేవతకొలువు

కొండదేవతా ! నిన్ను
కొలువవస్తినే,
దండాలందుకొని నాకు
దరిశనమీవే...

నను వలచిన జతగాడు
నాతో రాడీనాడు;
లోకంటికి నీరూపము
పోకదు, అలివికిరాదు
కొండ...

ఒక్కరైనె వస్తినంటు
ఉరుముతావు నావంకా !
కనవో, నా కన్నులలో
కదిలే వెలు గతగాడె
కొండ...

తప్పులెంచి కళ్ళల్లో
నిప్పులోసు కొన్నారే !
చూడలేదు లోకము మా
సుతిమెత్తని సహవాసము.

*

# నలిగినపూవు

రాతిరి వేళకు రా, మల్లీ ఒక
రాజ్యమేలుదువుగానీ
ఒక
రాజ్యమేలుదువుగానీ

ఏటిగట్ల ఇసకలలో వాలుగ
ఇద్దర మొక్కటై జారినచోట,
దాగుడుమూతల వంకన పనిగా
తరిమి తరిమి కనుమూసినచోట,
మామిడితోపుల, మల్లెపందిరుల,
మల్లీపోదా మోయి వయాళిగ
రాతిరి వేళ...

ఏమో తెలియని తరితీపుల ఊ
య్యాల లూపితివిగద మొనమొన్న!
అనుకోలే దాగడియల సంతటి
అమృత ముంటదని కలలోనైనా;
మరపురాని తొలిరేయి అలజడిని
మానసుతీరలే దంటివిగదరా
రాతిరి వేళకు...

కన్నులలోనా, కలలోనా, నీ
కలరూపే ఆవరించుకొన్నది.
ఏతలపున కెడమీయని అందా
లెచట దాచుకొన్నావోయీ మును ?
నలిగినపూవుల తొలిసువాసనల
నాకెవెరుంగని సంగనాచివా ?

రాతిరివేళకు ...



# ఊహా పై ఊహ

కోడలుపిల్ల :

ఏడకెళ్ళినగాని ఆడకే సీడల్లె
ఎంట బడతాడమ్మ కొంటె శెందురుడు !
ఒంటిగా విడకోయి, జంట బాయకుమోయి,
కంటిలో పాపల్లె కాచుకో మామా !

బంగారిమామ :

మావితోటలకాడ, మర్రిపూడలనీడ
ఆనాటి మనమాట, ఆ తేనె పాట
చిన్నిచిగురాకులలో చెవ్వొగ్గి విన్నాడో
ఏగలే మీాతనితో జాగరతె పిల్లా

కోడలుపిల్ల :

లేతచెంగలిగడ్డి పోతబోసిన-చోట
పంటకాలవమెంట పలుకాడుతుంటే,
కాలవాగిందేటొ గట్టు కదిలిందెటకొ
సిత్తరము మామయ్య సెప్పిపోరయ్యా !

బంగారిమామ :

ఏతీయలోకాలు ఏలాఁగా నీచూఁపు,
తెప్పలా బూఁదేవి తేలిపోతాది !
కాలాడకే గంగ కళ్ళప్పగించేను !
సూఁడకిళ్ళే నీయి సోజ్జాలమారి !

కోడలుపిల్ల :

అచ్చంగ నీరూఁపె అద్దినట్టుంటాది,
కొఁండకోఁమ్మ్రాదేటి కోటి మబ్బులలో !
నీముక్కు నీతీరు నీలికొఁండలదారి
ఎంచక్క మలిచేను ఏ మాఁయమనిసో !

బంగారిమామ :

మనసులో కలరూఁపు మబ్బుల్ల విరజిమ్మ్రి,
నాఁబొమ్మ్రదే అంటు నవ్వుకొంటావు !
నీవెన్న మనసేను నీకన్ను మలిచేను
నీసూఁపులో సోకె నారూఁపురేక. !

*

## ఇచ్చిత్రం

నీ వెళ్ళిపోగానె
నిదరపోతాది ;
ఈ తోటలోవున్న
ఇచ్చిత్రమేటో !

ఏ వారికాయాలో,
ఎట గాలి మెయ్యాలో,
కాలునిలకీపాంత
గాలి స్త నేనుంటె,
మిసమిసలమేలుకొని
గుసగుసల్ పోతాది !
నీ వెళ్ళి...

మినుకుమని దూరాన
కనిపిస్తివా చాలు,
నిక్కినిక్కి నేను
నిలుచున్న పాళాన,
సోలిపోతో, మంచు
పూలు రాలుస్తాది
నీ వెళ్ళి...

# ఇచ్చిత్రం

నీ వెళ్ళిపోగానె
నిదరపోతాది ;
ఈ తోటలోవున్న
ఇచ్చిత్రమేటో !

ఏ దారికాయాలో,
ఎట గాలమెయ్యాలో,
కాలునిలకీపొంత
గాలిస్త నేనుంటె,
మిసమిసలమేలుకొని
గుసగుసల్ పోతాది !
నీ వెళ్ళి...

మినుకుమని దూరాన
కనిపిస్తివా చాలు,
నిక్కినిక్కి నేను
నిలుచున్నపాళాన,
సోలిపోతో, మంచు
పూలు రాలుస్తాది
నీ వెళ్ళి...

పామల్లె నీపైట
పాకివస్తావుంటె,
సులివెచ్చగా ఊది
మలుపుకొంటూ గాలి,
ఏటిపిల్లంగోడు
మీటుకొంటది చూడు !
నీవెల్లి...

కనుసన్న నాచినిన్న
మనివాలకించంగ
ఆగి మూగవరాలు
అందిస్త నీవుంటె,
పుప్పొళ్ళ బుగబుగల్
గుప్పించి పోతాది !
నీవెల్లి....



# నా రాత

నా
రాతకిలా నలుగురిలో
నవ్వులపా లేన ?
నా . . .
రాత

కలక లేని వలపులోని
మెళుకువ లెరిగినవాడు,
అలిగినాడు నాపయి తన
కలలనీ డై పడనీడు –
ఏమని పంతాలో ఇం
కెంతని రోసాలో ?
నా
రాతకిలా . . .

ఏడదాగినావో నని
ఎల్లెడ వెతుకుదు నేను,
ఎచట దాచితివె దొరనని
ఎల్లరు నన్నడిగేరు !
ఏకడ మసిలేవో నీ
వెట బింకము సూపేవో !
రాతకిలా . . .

సరస మున్న వేళా నా
దొర నేనొకటని పొగరు ;
రవ్వ దూరమయినా ఇక
రాడని ఒకటే బెదురు ;
ఏక మనసుకోత ఒక
మేటికి ఎదురీత !
నా
రాతకిలా ...

కోపాలకు మూలమిదని
గొప్ప వూసు చెప్పేనా,
ఇంతేనా గుట్టని న
న్నిసడింతు రోరన్నా ;
లోకానికి వింత నా
లోగల వలవంత !
నా
రాతకిలా ...

*

## ఒంటరి పయనం

ఒంటరినై పోనా,

ఈ

ఓరుగాలిలోన దొరా!

ఒంటరినై ...

చిలిపి చిలిపి జగడాలకు
ఒలికే సింగారమొంచి,
అలక దీర్చి, కలక దేర్చి
పలకరించువారు లేక

ఒంటరినై ...

నిదరమాను నీడలంట
చెదరిన వెన్నెల రేకుల
పదునెక్కిన చురకత్తులు
పట్టి జళిపింతురెవరో

ఒంటరినై ...

మొగలిడొంక మలుపులోన
మోము దాచుకొన్నావా ?
దొండపందిరుల కిందై
దోబూచాడేన దొరా ?
ఒంటరినై ...

చీకటివెలుగుల సందున
చీలిన నీరెండలలో
జలకమాడ అడివిపిచుక
జంటలవే రివ్వుమంట !
ఒంటరినై ...

ఏటిమనుసు తోటసొగసు
ఏకమయిన చోటిక్కడ
సరస నీవు లేని బతుకు
సందర మనిపిస్తదోయి !
ఒంటరినై ...



# చందమామ

ఎక్కడికి పొయ్యేవు ?
చందమామా ! ను
వ్వెందాక పయనాలు ?
చందమామా ! ...

మబ్బంచుల గుఱ్ఱమెక్కి
మహాపసందు రాజఠీవి
మంచు తెరల వల్లెవాటు
మాటికి సవరించుకొంట,
ఎక్కడికి ...

నీలిమబ్బు కొండలపై
నిక్కి నిక్కి చూచేవు !
అలిగిన నారాజు జాడ
లంతుదొరుకునేమో కను
ఎక్కడికి ...

చిగిరించిన తోటంతా
చిన్నబోయెనని చెప్పు !
వెచ్చని వెన్నెల కాలము
వచ్చిందనరా చెవిలో –
ఎక్కడికి ...

ఏటిగట్టు ఇసకలలో
ఎన్నెలదుప్పటి పరిచీ
రమ్మనిపిలు నారాజును
రావీ ఘడియలు రేపని
ఎక్కడికి...

ఎండో ఎన్నెలో నీమన
సేదో రుజు ఏరాతిరి;
చల్లనిదొరవయితే మము
జంటకలిపిపో చూతము
ఎక్కడికి...

నీ తెచ్చిన పూలవాన
నీలిమలోడే నాపల;
కమ్మని మా కవుగిట నే
కడిగిన ముత్యాలరాశి
ఎక్కడికి...



# ముసురేసిందంటే

ముసురేసిందంటే పైన
అసలే మతిపోతది మామా!
పసిచెడినట్లుంటది లోలోన
ఓ ముద్దులమామా!

మబ్బు తెరల ముసకలలోన
మంచు పొగల మెలికలలోన,
మనసేటో చిక్కడినట్లే
మనేద కుదిపేస్తది లోన
ముసురేసిం...

పసుపాడిన పైగులనడుమ
పడగెత్తిన సన్ననితోవ
నువు మసిలే చెలకలవంకే
నురుగులు గ్రక్కేను గరాగం
ముసురేసిం...

కోవెలచిరుగంటలు చెవిలో
కావాలని కతకలిపించి,
దూరాగానున్నావని, నీపై
దుర్వార్త లేవో వినిపిస్తే;

ముసురేసిం . . .

ఏటి మబ్బుల్లో ధనుసల్లే
తోట ఒడలు విరివిన చోట,
నాటి మన సరాసికమంతా
నవ్వుతాలె అంటదిమెరుపు

ముసురేసిం . . .



# ఆనాటి మాట

ఆనాటి మనమాట
లంకలో ముసుకటర
ఆరనీ చిచ్చు వెలిగిస్తావటోయి
అరిపేదగుండె రగిలిస్తావటోయి ?

పుచ్చపూవెన్నెట్లో
పూతమామిళ్ళలో
కలిసి మసిలినరేల
మనసు కలిసిన వేళ

ఆనాటి . . .

కోనేటి గట్టంట
కూనిరాగము తియన్న
నీలాటి రేవులో
నీతాను నాగుండె

ఆనాటి . . .

చీడీలపడిు నేటిగా
సిగపూవు రాలింది,
చిన్న మొన్నటి బ్రతుకు
నేలపాలయ్యేన ?

అనాటి...

కడవనీళ్ళు బుజాన
కరుడు గట్టేనోయి ;
దారి నొకమారైన
తారసిల్లవు నేడు

అనాటి...



## మబ్బులు మబ్బులు !

మబ్బుల్లు మబ్బులు మబ్బులొచ్చినై
తబ్బిబ్బయ్యేగా నా మనసు
తళుక్కుమన్నది నీసొగసు

ఉరుములురిమి నను తరిమికొట్టితే
మెరుపుతీగ కొరడా జళిపిస్తే
మందవిడిన తువ్వాయికిమల్లే
మన సూరక బెంబేలై పోతది

మబ్బులు...

కొండలోయలో చిక్కనినీడలు
గుంపులు గుంపులు నడుస్తవుంటే,
గుండెలోతులో నల్లనివరవడి
గుట్టుచప్పుడుగ రాశేదెవరో !

మబ్బులు...

చిటపటమంటూ ఎండుటాకులో
చినుకొక్కటి పడి చిటిలి రాలితే,
కోరికతో గుదిగుచ్చుకొన్న ఒక
హారమె తెగిన ట్లదురుపడతాది

మబ్బులు...

*

# చల్లచల్లగా బండీ

చల్లచల్లగా బండీ
సాగనీయరా, మామ!
చెళ్లున కొరడా ఇసిరే
సిత్రమేటిరా?

ఎలపటెద్దు మందకొడిగ
ఎనకెనక్కై పోతుంటే,
దాపటెద్దు ముందరికే
తరుముకుపోతానంటది

సద్దుకుపోవేరా మన
సంసారము సూశయినా?

చల్లచల్లగా...

నువ్వుచేల తొలిపూతల
నవ్వులనురగలలోబడి,
ఎన్నెలలో చెట్లనీడ
తెగరజిమ్ముతా, బండి

పుంతదారి ఇసకలలో
పూపడవై పోవాలి

చల్లచల్లగా...

సూపులు దారెంట నిలిపి
పొద్దెము సూసర నాతో;
పడుసుగిత్త లేమరితే
బళ్ళగాడి దాటేస్తై;
ఊసులాడదామంటే
ఆశలేదురా కసింత
చల్లచల్లగా ...

గడ్డివాము నీడలంట
కలలుముసిరి కవ్విస్తే,
పొదసాటున కోకిలమ్మ
పదమేదో అల్లుతుంటె
మూగసూపుగా నడుమనె
ఆగిపోద మనిపిస్తది !
చల్లచల్లగా ...

ఎద్దులజత మెడగంటల
ఏమితీపు లొలికినవో,
పొదుపులోన ఏమరుపులు
కదిలి ఓసరిల్లినవో,
సిగ్గిడిసిన మనుసులెవో
మొగ్గతొడుగుతున్నయిరా
చల్లచల్లగా ...

*

# దాగుడు మూచ్చిలు

ఘుమఘుమలను మీటే
కోతిమెర చేలు దాటి
కోరికతో వస్తే నను
గోష పెట్టబోకురా
ఏడ దాగుడున్నావోయీ దొరా
నీ
జాడ తెలిసె లేవోయీ వెలికిరా
వెలికిరావోయి
వెలికిరా

తెరచాప ఇసురులో
తేలిపోతున్నాయి
తెల్ల గలగలలా ? నీ
తేటనవ్వు కిలకిలా ?
మల్లెపువ్వులా చిటుకని విరిసిపో;
మంచుబొట్టులా తళ్కని మెరిసిపో
మెరిసిపో
తళ్కని
మెరిసిపో

కోరతలపాగలో
కుచ్చు మెదిలేను సుమీ ;
దొరపుగాకు ఎన్నులలో
దోబూచాడే దొరా !
అడివితుగాయాలి కాపలె పొంచెరా
ఒడిసెలయే టూరకే తినేవురా

ఏటిరెల్లు పొదమాటున
కూతాలు మరిగినావో
ఒద్దోయీ ఆశ్శికాలు
వ్రాబిలోతు నీళ్ళల్లో
చెదిరిన తొలిచంద్రవంక నీడలో
మామ
చెదరని పున్నమి నవ్వులు చిల్కరా
చిలికిరా
నవ్వులు
చిలికిరా

# పాట విసురు

చూపులో సిరి చిందువాడా !
ఓపలేని గుండెలోతులు
పాటలో పలికించి పోవేరా
బంగారిమామా
తేట తేనెలతీయ మొలికేలా
రావోయి నావన్నెకాడా
రావోయి నాచిన్నివాడా

పండివాలిన కంకులన్ని
పట్టిమీటిన తంబురాలో
పంతమాడే పాటపాడాలీ
బంగారిమామా
వంతు బాయ్యో వరసలెత్తాలీ
రావోయి నావన్నెకాడా
రావోయి నాచిన్నివాడా

కాటుకాకొండాల మళుపున
ఏటిలో నీలాల తళుకులు
మూటగట్టిన పాట విసరాలీ
బంగారిమామా

ముచ్చటైన పదాలు పలకాలి
రావోయి నావన్నెకాడా
రావోయి నాచిన్నివాడా

చంకలో పసివాని కన్నుల
ఝల్లుమనిపించేటి మాటల
పిరకతలే తెల్విపోగదరా
బంగారిమామా
వేడినెత్తురు పొంగిపోవలెరా
రావోయి నావన్నెకాడా
రావోయి నాచిన్నివాడా

నాటిచేవా నాటిజీవము
నేటి మన బైరాగి బ్రతుకున
ఊదరా ఊయించి పోవేరా
బంగారిమామా
బూదిలో పూరించవలె రవ్వా
రావోయి నావన్నెకాడా
రావోయి నాచిన్నివాడా



# మేలుకో

లేవరా
నిదర
లేవరా
మామ
లేవోయీ
నిదరమేలు
కోవోయీ !

పకపకమని నవ్వింది
పచ్చనిపైరు,
ఆ
పైరుమీద సీడలేవో
పాకుతున్నవి
లేవరా ...

మనకీ ఈ బూదేవికి
మద్దైనున్నదీ
మాటు
మాయదారి బూతమేదో
ముసురుతున్నదీ
లేవరా ...

మనదికాదురా ఈసిరి
మనది కాదు లే
ఈ
మంటికి జీవము పోసిన
మహారాజా లే
లేవరా ...

రక్కసపొద వెన్క నెవరో
నక్కుతున్నరు ;
అటు
తక్కుతు తారుతు పొలాన
నక్కుతున్నరు
లేవరా ...

పలపలమని విరిసిందీ
పంటలచ్చిమీ ;
దాపున
కంకుల కంతాన నేదో
కళుకుమన్నదీ
లేవరా ...

*

# పట్నానికి పయనం

పట్నవాస మెందుకంటే
బంగరిపిల్లా ! ను
వ్విష్టపడితివా స్వర్గం
భూతలమల్లా

సరుకుతోట తేనెతేట
సంగీతపు ఝల్లు
కందిచేల నులివెచ్చని
కాసుల ఘల్ ఘల్లు
అనుకోని రాజభోగ
మమరిన ఈకోన విడిచి
పట్న...

ఒడలొంచితె లొంగిరాని
బంగరు నేల కలదే ;
పిడుగడినా అడలిపోక
నిలబడి పోవలదే
అలిగింగని కొండవాగు
వలస పోదమంటావు
పట్న...

ఇంకిపోతు ఇంకిపోతు
    ఏరు వ్రాసిచనదా
ఇసకనేల వక్షస్సున
    ఏటా మనగాథా
గురుతులివే వేనవేలు
చెరపకువే ఆనవాలు

పట్న ...

పల్లెపట్టు నీడలలో
    పరిమళించినాము ;
కల్లాకపటాల మకిలి
    డుల్లిపోవలేము
తొడిమనున్న జంటపూలు
చూసినట్టు లయిపోతము

పట్న ...



## 'వెళ్ళిపోదామా'?

వెళ్ళిపోదామా,
వెళ్ళిపోదామా ?
వెళ్ళిపోదము పట్నవాసపు
కుళ్ళు వీధులలో బడి ?
వెళ్ళిపోదామా...

ఈనమోపై పున్నపైరులు
పటిమంచుకల పాలుజేసి,
కొంపగోడీ విడిచి పట్టెడు
కూటికై ఊరేగవలెరా
వెళ్లిపోదామా...

పంటతల్లిని పరిహాస్యపు
పాతరల ఖయిదుంచినారో ?
గుండెలోన ఎడారి మండే
గోడెరుంగ దికేమి దిక్కో
వెళ్లిపోదామా...

ఒళ్లు పెంచిన గడ్డమీదే
ఒరిగిపోయ్యే రాణలేదో,
ఊరుగానీ ఊరిలో చితి
పేర్చుకొమ్మని నొసటి వ్రాలో !
వెళ్లిపోదామా ...

రాజనపు రతనాలభూమిని
ఏమనీ సెలవడిగి వస్తవు ?
ఏ కడల మన్నయిన, తనలో
ఇమిడిపోవక తీరదనరా
వెళ్లిపోదామా ...

గడిచిపోయెనె పూలుపూచిన
గడియలిక మనకాపురములో ?
కాలమొక్క మహాగ్నిగుండము
కాచుకొన్నది ముందు మునకై
వెళ్లిపోదామా ...



# ఈ చెట్టు నీడనే

ఈ చెట్టు నీడనే ఇంకిపోదామోయీ,
ఎందుకీ తిరిపెంపు వేట ?
ఓ మామ !
ఏదాక ఈ దేవులాట ?

మేడకాదోయి అది ; వాడకాదోయి ఇది -
కటికిగుండెలు తార్చి కట్టుకొన్నా కోట !
ఈ ...

కొలుకుల్ల ప్రాణాలు ఒలికిపోయే బిడ్డ
తుదిపుల్కరింపుతో తూలిపోవక మున్నె
ఈ ...

అంతులేని దురాశ లంటుగట్టిన నేల
పంట కెరువై చాలు వంతు మనదీనాడు
ఈ ...

*

# రోడ్డురోలరు

లాగరా, హాయిలెస్స లాగరా,
రోడ్డురోలరు ముందడుగై సాగరా

నడినెత్తిన సూరీడు నకనకలాడించేడు ;
కంకరరస్తాలో సగ మింకా మిగిలున్నదిరా
లాగరా...

రోల్సురాయి మోటార్ల షికార్లకు
కుదుపొచ్చిందట !
పూలపానుపల్లె తోవ పొడుగున మలసాలంట
లాగరా...

గోదావరి వరదలొచ్చి గోలగున్నదంట ఈడ .
కట్టుసుకా లింటానికి గవినే రొస్తాడంట
లాగరా...

మారువాడిఅప్పుకంటె, మాయదారి బ్రతుకుకంటె
బరువా ఇంతోటిపెద్ద బండరాయి మామయ్యా ?
లాగరా...

లచ్చులున్న సావుకారు లాభాలను మోసింపుకా
శారీయాపారములో లారీ కొన్నాడంట
లాగరా ...

మర్రిసెట్టు ఊడనీడ, మడిసిపురుగు లేనికాడ
సనుబాలకు కక్కుటిల్లి సంటో డేడుస్తుండడు
లాగరా ...

మెతుకు విదిపితేనే తమ బతుకుపోయె ననుకుంటరు;
మూడాకవళం మల్లన మడిసిపోయిం డీపక్కనె
లాగరా ...

పొలము పుట్ర అమ్ముకోని, పొట్టసేత బట్టుకోని
వలసపోయిం డీదారినె పంటకాపు పట్నానికి
లాగరా ...



# రాచపగ

రగిలించేవాకోలె వగలాడి పసుచ
రాచపగ నాదోలె తాచుపగనాది !

కూలిబత్తెపురాళ్లు కూటికే రావంటె,
కొట్టవచ్చిన బాబు కొలువుసెయమంటావు
రగిలించ ...

కుమిలిపోయే బ్రతుకు కుళ్లబొడిచే తిట్లు
దిగమింగమంటావు తగవాడకంటావు   రగిలించ ...

నా చేతిమీదుగా నడిచిపోయిన సిరులు
నను వెక్కిరించితే నన్ను కాదనుకోన?   రగిలించ ...

ఒకడనైతే నేమి ఒట్టిరోసమ నాది ?
కలిసికట్టుండాలి కలబడాలంటావు –   రగిలించ ...

మొర వినే దెవడోలె తిరగబడతా నంటె,
మంచిరోజులు కాదు మనకిప్పు డంటావు
రగిలించ ...

కుతికకంటా తిన్న గొప్పోరి పాదాల
రాధారి మన బ్రతుకు లేదారి మన కింక? రగిలించ ...

కూరుచున్నా దొరకు కుప్పలందించాల !
తిరిగితిరిగి మనకు తిప్పలేనా కొసకు ?   రగిలించ ...

*

# సందరాలు దాటి

సందరాలే దాటి
సరస మున్నావంటె
సాహస మికే ముందిరా ?
ఓమామ
సంబర మికే ముందుగా

మనకవెన్నెలబైట
మాగన్ను నిదరలో
గుడిగంట లాకవేయి ఊగేనా ?
ఓమామ
గుండెలోతులలోన మోగేనా ?

నీరెండపసుపులో
నిగ్గుదేరిన గడప
ముంగిట్లో నీ అడుగుజాడ !
ఓమామ
ముగ్గేసెరా వెన్నెకాడ

పెరటిలో చిటిమల్లె
విరగబూసిందేర ?
పులకరించీ వొళ్ళు పొంగెనా ?
ఓమామ
పూలు బరువై తీగ వంగెనా ?

ఏ రాజు గెలిచేనో
ఎందుకీ సొదనాకు ?
ఏ రాజులేమైతె ఎందుకోయీ మామ
నా రాజె నాకేసి నడిచిరా

కూడబెట్టిన వయసు
గుట్టు చెదరని మనసు
నీకోసమే నోయి నిరుకుగా
ఓమామ
నిలుపుకొన్నానోయి నీతిగా.

